

# తరగని సంపద

పూర్వం బాగ్దాదు నగరంలో ఖలీఫాగా ఉండిన హరూనల్‌రషీద్ అన్ని విధాలా యోగ్యుడే గాని, తనను మించిన సంపద ప్రపంచంలో మరెవరికీ లేదన్న అహంకారం ఆయనలో బలంగా ఉండేది; తన కన్న ధారాళంగా దానాలు చేసే వాడెవడూ లేడనుకునేవాడు. ఈ విషయం ఆయన తరుచుగా గొప్పలు చెప్పుకునేవాడు.

ఒకరోజు ఖలీఫా మితిమించి తన దాతృత్వాన్ని పొగడుకుంటూ ఉండటం చూసి భరించలేక, వజీరైన జఫర్ ఆయనకు కనువిప్పు కలిగించ నిశ్చయించి, "హుజూర్, మానవులు అల్లా సమక్షంలో అణకువగా ఉండటం కన్న గర్వించదగినది మరేదీ లేదు. సమస్త సంపదలూ, సద్బుద్ధీ కూడా దైవం ప్రసాదించేవే. అవి ఉండటం మనిషికి గర్వకారణం కాకూడదు. తమ దాతృత్వాన్ని ప్రజలు మెచ్చుకోనివ్వండి. అదీ గాక, తరగని సంపదను అల్లా తమకేగాదు, ఇతరులకు కూడా ఇచ్చాడు. బస్రానగరంలో ఒక సాధారణ పౌరుడైన యువకుడు ఉన్నాడు. అతని పేరు అబూఅల్ కాసిమ్. అతనికి ఉన్న సంపద ప్రపంచంలో ఏ చక్రవర్తికీ లేదు. దాతృత్వంలో ఏలిన వారు కూడా అతనితో పోటీ చెయ్యలేరు," అనేశాడు.

ఈ మాటలు వినేసరికి ఖలీఫా ముఖం ఎర్రబడి కళ్ళ నుండి నిప్పులు రాలాయి. ఆయన జఫర్‌తో, "బుద్ధిహీనుడా, ఇలాటి అబద్ధానికి శిక్ష మరణదండనే అని ఎరుగుదువా ?" అన్నాడు.

"తమ మీద ఒట్టు పెట్టుకుని చెబుతున్నాను, నేను చెప్పినది అక్షరాలా నిజం !" అన్నాడు జఫర్. అతను ఇంకా ఇలా అన్నాడు : "నా మాట నమ్మకపోతే, తమరు ఎవరి నన్నా పంపి వాకబు చేయించండి.

అరేబియా జానపదకథ




ఆ మనిషి ఏమి చెబితే దానికి నేను బద్ధుణ్ణి. నేను కిందటిసారి బస్రా వెళ్ళినప్పుడు అబూ అల్‌కాసిమ్‌కు అతిథిగా ఉండటం జరిగింది. మరోసారి చెబుతున్నాను—ఈ కాలంలో అతన్ని మించిన దాత ప్రపంచంలో లేడు.''

ఖలీఫాకు నోట మాట రాలేదు. పట్టరాని కోపంలో ఆయన, జఫర్‌ను నిర్బంధించమని భటులకు సంజ్ఞ చేసి, అక్కడి నుంచి త్వరగా జుబేదా రాణి మందిరానికి వెళ్ళిపోయాడు. ఆయన ముఖం చూసి జుబేదా రాణి తెల్లబోయింది. ఆమె ఆయనకు గులాబీ వాసన గల నీరు తాగటానికి ఇస్తూ, ''ఇది తాగి శాంతించండి!'' అన్నది.

''ఆ లుచ్చా, జఫర్ మూలంగా శాంతి లేకుండా పోయింది. వాడు నాకు ఎదురు చెప్పటమే గాక, నన్ను కాదని ఊర్ూ పేరూ లేని వెధవలను ఆకాశాని కెత్తుతున్నాడు!'' అంటూ ఖలీఫా జరిగిన దంతా చెప్పాడు.

జఫర్ ప్రాణానికి పెద్ద ముప్పే వచ్చి పడిందని జుబేదా గ్రహించి, ఖలీఫాను ఒక చెంప సమర్థించుతూనే, ఎవరినన్నా బస్రాకు పంపి విచారణ జరిపినదాకా జఫర్‌ను శిక్షించడం మంచిది కాదని సలహా ఇచ్చింది.

జుబేదా మాటల ప్రభావంతో ఖలీఫా మనసు చాలావరకు శాంతపడింది. అందుచేత ఆయన, ''నేను మాత్రం నిజం తెలుసుకోకుండా జఫర్‌ను ఎందుకు శిక్షిస్తాను? నా కళ్ళతో చూస్తేనేగాని నేను దేన్నీ నమ్మలేను. అందుచేత నేనే స్వయంగా వెళ్ళి, బస్రాలో ఉండే అబూ అల్‌కాసిమ్‌ను చూస్తాను. జఫర్ అతిశయోక్తులు చెప్పి ఉంటే వాడికి ఉరిశిక్ష తప్పదు,'' అన్నాడు.

ఒంటరిగా వెళ్ళవద్దని జుబేదా ఎంత బతిమాలినా వినిపించుకోకుండా, ఖలీఫా వర్తకుడి లాగా మారువేషం వేసుకుని, బస్రాకు బయలుదేరి వెళ్ళాడు.

ఆయన క్షేమంగా బస్రా చేరి, ఆ నగరంలోని పెద్ద సత్రంలో దిగాడు. భోజనానికైనా

కూర్చోకుండానే; ఆయన సత్రం చౌకీదారును కలుసుకుని, "ఈ ఊళ్ళో అబూ అల్ కాసిమ్ అనే యువకుడున్నాడట; అతను చేసే దానాలు మహారాజులు కూడా చేయలేరట, నిజమేనా?" అని అడిగాడు.

చౌకీదారు తల ఆడించి, "అల్లా అనుగ్రహం! ఆ మహానుభావుడి దయకు పాత్రుడు కానివాడు ఒక్కడైనా ఉన్నాడా? నాకు నూరు నోళ్ళున్నా కూడా అతని దానాలను వర్ణించలేను," అన్నాడు. ఇంతలో ఇతర వర్తకులు దిగటంవల్ల చౌకీదారు వారి కోసం వెళ్ళిపోవలసి వచ్చింది.

ఖలీఫా ఆ రాత్రికి అంతటితో తృప్తిపడి, మర్నాడు ఉదయమే లేచి దుకాణా లుండే బజారు కేసి వెళ్ళాడు. దుకాణాలు తెరవగానే ఒక దుకాణదారును కలుసుకుని, అబూ అల్ కాసిమ్ ఇంటికి దారి అడిగాడు.

"మీరు దూరప్రాంతం నుంచి వచ్చినట్టున్నది. రాజభవనంలో రాజుగారిని ఎరగని వాళ్ళు ఉండవచ్చునేమో గాని, ఈ నగరంలో అబూ అల్ కాసిమ్ ఇల్లు తెలియనివారు లేరు," అన్నాడు దుకాణదారు.

"నేను దూరం నుంచే వచ్చాను. వచ్చినది కూడా ఈ యువకుణ్ణి చూడటానికే," అన్నాడు ఖలీఫా దుకాణదారుతో.

దుకాణదారు ఖలీఫా వెంట ఒక కుర్రవాణ్ణి పంపాడు.




అబూ అల్ కాసిమ్ భవనం చుక్కల పాలరాతితో కట్టారు. దాని ద్వారాలకు వెల లేని అకుపచ్చమణి శిలలు తాపారు. భవనం ముందు ఆవరణలో కొందరు బానిసలు ఆటలలో మునిగి ఉన్నారు. ఖలీఫా ఒక బానిసను పిలిచి, ఇంటి యజమానిని చూడటానికి బాగ్దాదు నుంచి ఒక అపరిచితుడు వచ్చినట్టు చెప్పమని లోపలికి పంపాడు.

ఈ కబురు అందగానే అబూ అల్ కాసిమ్ అతిథికి స్వాగతం చెప్పటానికి బయటికి వచ్చి, మృదువుగా స్వాగత వచనాలు పలికి, ఖలీఫాను చెయ్యి పట్టుకుని ఒక అందమైన హాలులోకి తీసుకుపోయాడు.




గది నాలుగు గోడల వెంబడీ జరీ అంచు గల సిల్కు తొడుగులు గల మెత్తలున్నాయి. ఇద్దరూ వాటి మీద ఆసీనులయినాక, పన్నెండుమంది బానిసలు కెంపులు పొదిగిన స్ఫటిక పాత్రలలో ద్రాక్షసారా తెచ్చారు. వారి వెనకగా పన్నెండుమంది ఆడపిల్లలు పింగాణీ పాత్రలలో పళ్ళూ పూలూ, బంగారు పాత్రలలో షర్బతూ తెచ్చారు. వాళ్ళు తెచ్చిన పానీయాలు చవి చూడగానే, తన భవనంలో అలాటి పానీయాలు ఎన్నడూ లేవని ఖలీఫాకు తెలిసిపోయింది.

మరొక గదిలో ఖలీఫాకు బంగారు పళ్లాలలో భోజనం పెట్టారు. ఆ భోజన పదారాలు కూడా ఉత్తమోత్తమంగానే ఉన్నాయి. తరవాత ఆయన తనకోసం ఏర్పాటు చేసిన సంగీతం వింటూ, "నా రాజభవనంలోనూ శ్రావ్యమైన గాయకులున్నారు; సంగీత రహస్యాలన్నీ తెలిసిన ఇషాక్ ఉన్నాడు; కాని ఈ సామాన్య వ్యక్తి ఇంట జరిగే గానగోష్ఠి స్వర్గంలో కూడా లభించదనిపించేదిగా ఉన్నదే!" అనుకున్నాడు.

ఖలీఫా సంగీతం వినటంలో నిమగ్నుడై ఉండగా అబూ అల్ కాసిమ్ లేచి అవతలికి వెళ్ళి, ఒక చేతిలో అంబరు బెత్తమూ, రెండో చేతిలో ఒక చెట్టుబొమ్మా పట్టుకుని వచ్చాడు. ఆ బొమ్మచెట్టు కాండం వెండితోనూ, ఆకులు పచ్చలతోనూ, కాయలు కెంపులతోనూ చేసి ఉన్నాయి. చెట్టు పై భాగంలో ఒక బంగారు నెమలి బొమ్మ ఉన్నది. అది ఎంతో నైపుణ్యంతో తయారు చేసిన నెమలిబొమ్మ. అబూ అల్ కాసిమ్ ఆ చెట్టును ఖలీఫా ముందు పెట్టి, నెమలి బొమ్మను అంబరుబెత్తంతో కొట్టగానే ఆ నెమలి రెక్కలు చాపి, పింఛం విప్పి, వేగంగా గుండ్రంగా తిరగసాగింది. అది అలా తిరుగుతుంటే దాని శరీరంలోని రంధ్రాల నుంచి సువాసనలు వెలువడి, వాటితో గది అంతా నిండిపోయింది.

కాని హరూన్ చేరగిలబడి కూర్చుని ఈ వింత వస్తువును చూసి ఆనందించటం ప్రారంభించే సరికల్లా అబూ అల్ కాసిమ్

చప్పున ఆ బొమ్మను తీసేసుకుని అపతలికి వెళ్ళిపోయాడు.

"ఇదేం మనిషి? అతిథి సత్కారమంటే ఇలా వుంటుందా ఎక్కడన్నా? జఫర్ చెప్పినంత కాకపోతే మానె, ఈ మనిషికి మామూలు మర్యాదలు కూడా తెలిసినట్టు లేవే! ఆ పక్షిబొమ్మను అడిగేస్తానని భయ పడ్డాడు లాగుంది. ఈ మనిషి గొప్పదనాన్ని స్వయంగా చూడరావటం మేలే అయింది," అనుకున్నాడు ఖలీఫా.

ఆయన ఇలా అనుకుంటూండగా అబూ అల్ కాసిమ్ ఒక అందమైన బానిస కుర్ర వాణ్ణి వెంటబెట్టుకుని తిరిగి వచ్చాడు. ఆ కుర్రవాడు ముత్యాలు కూర్చిన చమ్కీ దుస్తులు ధరించి ఉన్నాడు. వాడి చేతిలో ఒక పాత్ర ఉన్నది. అది ఒకే కెంపురాయి నుంచి మలిచిన పాత్ర. ఆ పాత్ర నిండా సారా ఉన్నది. బానిసకుర్రవాడు ఖలీఫాకు వందనం చేసి, ఆ పాత్రను ఖలీఫాకు అందించాడు. ఖలీఫా అందులోని సారా తాగేసి చూస్తే, దాని నిండా తిరిగి సారా ఉంది. దానిని మళ్ళీ తాగి ఖలీఫా బానిస కుర్రవాడి కిస్తూ, అది మూడోమారు సారాతో నిండుతూండటం గమనించాడు.

ఈ అక్షయ సారాపాత్ర నెమలిబొమ్మ కన్న కూడా అద్భుతంగా ఖలీఫాకు తోచింది "దీని మర్మం ఏమిటి?" అని ఆయన అబూ అల్ కాసిమ్‌ను అడిగాడు.

"అందులో నిజానికి అద్భుత మేమీ లేదు. ఒక ప్రాచీన కాలపు విజ్ఞాని దీన్ని






తయారుచేశాడు," అంటూ అబూ అల్ కాసిమ్ బానిస కుర్రవాళ్లు త్వరత్వరగా అక్కడి నుంచి లాక్కుపోయాడు.

"ఛీ, ఛీ! ఈ యువకుడికి కొంచెం కూడా బుద్ధి లేదనుకోవాలి, లేదా ఇతనికి సాధారణ మర్యాదలు కూడా తెలియక పోవాలి; నేను అడగా పెట్టకుండా అద్భుత వస్తువులు తెచ్చి చూపుతాడు; నాకు వాటిలో ఆసక్తి కలుగుతూండగా లాక్కుపోతాడు! ఇది మోసమూ, వెకిలితనమూ కూడాను. కొంచెం ఆలోచించి మాట్లాడేటట్టుగా జఫర్‌కు బుద్ధి చెప్పాలి," అనుకున్నాడు ఖలీఫా.

ఇంతలోనే అబూ అల్ కాసిమ్ తిరిగి వచ్చాడు. అతని వెంట ఒక అందమైన అమ్మాయి ఉన్నది. ఆమె అందం దేవతలకు కూడా ఉండదు. ఆమె శరీరం నిండా రత్నాలున్నాయి, కాని ఆమె అవయవాల అందాన్ని అవి దాచటం లేదు. ఆమె ఎదురుగా కూర్చుని కిన్నెర వాయిస్తూ ఉంటే ఖలీఫా ఆ పాటవశ్యంలో నెమలిబొమ్మనూ, కెంపు పాత్రనూ పూర్తిగా మరిచిపోయాడు. ఆయన యువకుడి కేసి తిరిగి, "బాబూ, నిన్ను చూస్తే ఈర్ష్య పుట్టుకొస్తున్నది!" అన్నాడు.

ఖలీఫా ఇలా అనటమే వ్యవధిగా అబూ అల్ కాసిమ్ ఆ పిల్లను చెయ్యి పట్టుకుని అక్కడి నుంచి అతి వేగంగా లాక్కుపోయాడు.

ఈ మూడో అవమానంతో ఖలీఫాకు ఎంత ఆగ్రహం వచ్చిందంటే ఇక అక్కడ ఉంటే అది అగ్నిపర్వతం లాగా బద్దలయేటట్టు తోచింది. అందుచేత ఆయన, అబూ అల్ కాసిమ్ మరోసారి తిరిగి రాగానే, "అయ్యా, ముఖం ఎరగనివాడికి నువు చేసిన ఆతిథ్యం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఇక నాకు సెలవిస్తే నేను వెళ్ళిపోతాను. ఇప్పటికే చాలా ఆతిథ్యం పొందాను," అంటూ లేచి నిలబడ్డాడు.

అతిథిని బలాత్కారం చెయ్యటం ఇష్టం లేక, ఖలీఫా కోరిక శిరసావహించినట్టుగా తల వంచి, అబూ అల్ కాసిమ్ ఆయనను

తలవాకిలి దాకా సాగనంపి, తన ఆతిథ్యంలో లోపా లుంటే క్షమించమని వేడుకున్నాడు.

ఖలీఫా తన బసకు తిరిగి వస్తూ, "వట్టి దాంభికుడు! మూర్ఖుడు! కొత్తవాళ్ళ ముందు తన సంపదను ప్రదర్శించి తృప్తి పడతాడు. దాతృత్వం ఎన్నటికీ కాదు. పిసినారితనం. వీడు పిసినిగొట్టులలో కూడా చాలా నాసిరకం. అబద్ధా లాడినందుకు జఫర్ అనుభవిస్తాడు," అనుకున్నాడు.

మండిపోతూ ఖలీఫా సత్రం చేరేసరికి దాని ముందు ఆవరణలో అర్ధవలయా కారంలో బానిసపిల్లలు నిలబడి ఉన్నారు. వారిలో సగంమంది తెల్లబానిసలు, సగం మంది నల్లబానిసలు. వారినడుమ, అబూ అల్ కాసిమ్ ఇంట కిన్నెర వాయించిన అమ్మాయి నిలబడి ఉన్నది. ఆమెకు కుడి వైపున కెంపుపాత్ర పట్టుకుని బానిస కుర్ర వాడు నిలబడి ఉన్నాడు. ఆమెకు ఎడమ పక్కన నిలబడిన మరొక కుర్రవాడి చేతిలో నెమలిగల చెట్టున్నది.

ఖలీఫా ఆవరణలోకి అడుగు పెట్టగానే బానిసలందరూ ఆయన ముందు సాష్టాంగ పడ్డారు. బానిసపిల్ల ముందుకు వచ్చి ఖలీఫాకు ఒక లేఖ ఇచ్చింది. అందులో ఇలా ఉన్నది:

"మా ఇంటికి వచ్చి, మా ఇంటిని పవిత్రం చేసిన అతిథి పరుడికి శాంతి



సౌఖ్యాలు కలుగుగాక! తరువాత—ఈ హీన మైన కానుకలు తాము స్వీకరించ ప్రారన. ఈ బానిసలూ, చెట్టూ, నెమలీ, కెంపుపాత్రా తమను స్వల్పంగా ఆకర్షించటం గమనించి, వాటి నన్నిటినీ తమకు కానుకగా ఇవ్వ సాహసించాము. ప్రతిదీ అల్లా నుంచే వచ్చి, అల్లాకే తిరిగి పోతుంది!"

ఈ లేఖ యొక్క సారాంశం అర్థంకాగానే ఖలీఫాకు పశ్చాత్తాపం కలిగింది. "ఈ యువ కుణ్ణి ఎంతగా అపార్థం చేసుకున్నాను! నీ విశాలహృదయం ఏ మయింది, హారూన్! నా కసలు విశాల హృదయమంటూ లేనే లేదు! విశ్వాస పాత్రుడైన జఫర్! అల్లా నిన్ను కటాక్షించుగాక! నా అతిశయానికీ,

దురహంకారానికీ మంచి పాఠం నేర్పావు. ఈ మామూలు పౌరుడు, రాజాధిరాజులు సైతం ఇచ్చి వేయటానికి జంకే కానుకలను నిశ్చింతగా ఇచ్చేశాడు. మామూలు పౌరుడి కింత సంపద ఎక్కడిది? మర్యాదకు భంగ మైనా సరే నేనీ రహస్యం తెలుసుకోవాలి," అనుకున్నాడు ఖలీఫా.

అందు చేత ఆయన తన కానుకలను సత్రం ఆవరణలోనే ఉండనిచ్చి, అబూ అల్‌కాసిమ్ ఇంటికి తిరిగి వెళ్ళి, "మహా దాతా, అల్లా కటాక్షం నీమీద మరింత ఉండు గాక! నువు పంపిన కానుకలు ఎంత అమూల్యమైన వంటే, వాటిని స్వీకరించ టానికి నాకు జంకుగా ఉన్నది. వాటిని తీసుకోవటం అతిథిగా నా ధర్మాన్ని నేను అతిక్రమించట మవుతుందనిపిస్తున్నది. వాటిని తిరిగి ఇవ్వటానికి అనుమతించి నట్టయితే నేను శలవు పుచ్చుకుని నీ దాతృత్వాన్ని బాగ్దాదులో చాటుతాను," అన్నాడు.

ఈ మాటలు విని అబూ అల్‌కాసిమ్ దీనంగా, "స్వామీ, నా ఆతిథ్యమూ, నే నిచ్చిన క్షుద్రమైన కానుకలూ తమకు అసంతృప్తి కలిగించి ఉండాలి. లేనిపక్షంలో తమరు సత్రం నుంచి తిరిగివచ్చి నన్నిలా అవమానించరు!" అన్నాడు.

వెంటనే ఖలీఫా, "అలా ఎన్నటికీ అనుకో వద్దు. అల్లా దయవల్ల నేను ఆతిథ్యం ఇచ్చిన వారిని అవమానించే మనిషిని కాను. ముఖం తెలియని వారికి ఇంత వెలలేని బహుమానా లిచ్చి, నువు దారిద్ర్యం పాలపడతావేమో నని తిరిగి వచ్చాను," అన్నాడు.

"మీరు తిరిగి రావటానికి అదే కారణ మైతే మీకు ఎలాటి విచారమూ వద్దు. ఎందు చేతనంటే, అభ్యాగతులుగా వచ్చేవారికి నిత్యమూ ఇలాటి కానుకలే ఇస్తూ అల్లా రుణం తీర్చుకుంటున్నాను. అసలు సంగతి ఏమంటే, అల్లా నాకు తరగని సంపద ఇచ్చాడు. నా మాట మీరు నమ్మాలంటే నా కథ అంతా మీకు చెప్పాలి. నిజానికి అది చాలా చిత్రమైన కథ," అన్నాడు అబూ అల్‌కాసిమ్.

—(ముగింపు వచ్చే సంచికలో)






# తరగని సంపద

## 2

అబూ అల్ కాసిం ఖలీఫాను చెయ్యిపట్టుకుని తీసుకుపోయి ఒక చల్లని గదిలో బంగారు ఆసనం మీద కూర్చోబెట్టాడు. ఆ గదిలో సాంబ్రాణి కాలుతున్నది. గదినిండా సుగంధ ధూపం ఉన్నది. నేలమీద మెత్తని తివాసీ ఉన్నది. అబూ ఖలీఫా సరసనే కూర్చుని, తన కథ ఇలా చెప్పసాగాడు:

మా తండ్రి అబ్దుల్ అజీజ్ అనేవాడు కైరోనగరంలో ప్రసిద్ధి కెక్కిన నగల వర్తకుడు. ఆయన తాతముత్తాతలు కూడా ఆ నగరంలో ఉండిన వారే అయినప్పటికీ, అపారంగా ధనం ఆర్జించిన నా తండ్రి ఈజిప్టు సుల్తాను లోభానికి వెరిచి, ఈ బస్రా నగరంలో, అబ్బాసిద్ ఖలీఫాల రక్షణలో తల దాచుకోవలసి వచ్చింది.

ఈ నగరంలోకెల్లా ధనికుడైన వర్తకుడి కుమార్తెను నా తండ్రి వివాహం చేసుకున్నాడు. ఆమెకు తోబుట్టువులు లేరు. నా తల్లిదండ్రులకు నే నొక్కణ్ణే సంతానం. ఈ కారణం చేత, నా చిన్నతనంలోనే తల్లిదండ్రులు చనిపోగా, నేను బ్రహ్మాండమైన ఆస్తికి వారసుణ్ణి అయాను.

అయితే నేను ఒళ్ళు తెలియకుండా ఖర్చుపెట్టి, రెండేళ్ళలో నాకున్నదంతా తగలేసుకుని, బస్రానగర మంతటా నా పేరు మారుమోగేటట్టు చేసుకున్నాను. ఇంత పేరు తెచ్చుకున్న చోట దరిద్రుడుగా జీవించలేక, బస్రా విడిచి మరెక్కడికైనా పోదలచి, ఇల్లు వాకిలి అమ్మేసి, వర్తకుల బిడారు వెంట బయలుదేరాను. మోసుల్, డమాస్కస్ నగరాలు చూసి, అక్కడినుంచి ఎడారిదాటి మక్కాయాత్ర చేసి, కొన్నాళ్ళతర్వాత నా తాతముత్తాతల జన్మస్థలమైన కైరో నగరం చేరుకున్నాను.



కైరోనగరపు భవనాలూ, మసీదులూ చూడగానే నాకు నా తండ్రి జ్ఞాపకం వచ్చి ఏడుపు వచ్చింది. ఆయన ఈ నగరంలో ఎంత వైభవంగా జీవించాడు! బరువెక్కిన గుండెతో సుల్తానుభవనం వెనుక ప్రాంతంలో ఉన్న నైల్‌నది ఒడ్డుకు వెళ్ళాను. నేను తల ఎత్తి చూసేసరికి, ఎత్తున ఉన్న గవాక్షం వద్ద ఒక యువతి ముఖం కనిపించి మాయ మయింది. అందమైన ఆ ముఖం మళ్ళీ కనిపిస్తుందేమోనని చీకటిపడిన దాకా అక్కడే ఉండి పోయాను. కాని ఆ ముఖం తిరిగి కనిపించలేదు.

ఆ రాత్రి సత్రంలో నా బసకు తిరిగి వెళ్ళి, మర్నాడు ఉదయం మళ్ళీ అక్కడికే వచ్చి ఆ గవాక్షం కేసే చూస్తూ కూర్చున్నాను. ఆ రోజు నాకా ముఖం కనిపించ లేదు గాని, గవాక్షపు తెర వెనక ఏదో మసులుతున్నట్టు నాకు తోచింది.

మూడో రోజు సాయంకాలం గవాక్షపు తెర పక్కకు తొలిగి, చుక్కలాటి ముఖం తళుక్కున మెరిసింది. నేనా ముఖానికి ఆత్మార్పణ చేసుకుని, "సుందరీ, నేను పరదేశిని. ఈ కైరోలోకి వస్తూనే శుభశకునంలాగా నీ ముఖం చూశాను. నా కోరిక ఈడేరుతుందా?" అన్నాను.

ఆమె ముఖాన భయం కనిపించింది. కాని మరుక్షణమే ఆమె గవాక్షం నుంచి బయటికి వంగి, రహస్యంగా, "ఇప్పుడు వెళ్ళిపో. అర్ధ రాత్రికి రా!" అని, అంతలోనే, మంత్రించినట్టు గవాక్షపు తెర వెనుక మాయమయింది.

నా ఆనందం వర్ణనాతీతం. ఆ ఆనందంలో నా కష్టాలన్నీ మరిచాను. నేను బసకు తిరిగి వెళ్ళి, స్నానశాలలో సుఖంగా స్నానం చేసి, అర్ధ రాత్రివేళ రాజభవన గవాక్షం చేరుకున్నాను. గవాక్షం నుంచి తాటి నిచ్చెన కిందికి వేళ్ళాడుతున్నది. నేను సాహసించి దాన్ని ఎక్కి లోపల ప్రవేశించాను. రెండు చీకటి గదులు దాటినాక మూడో గదిలో నేను ఆ సాయంత్రం చూసిన స్త్రీ కనిపించింది.

నే నామెకు నా కష్టాలు చెప్పుకున్నాను. ఆమె నా కథ విని కన్నీరు కార్చింది.

"విచారించకు. నీ ఒక్క కన్నీటి బిందువుతోనే నా కష్టాలన్నీ తుడిచి పెట్టుకు పోయాయి," అన్నాను.

ఆమె తన విషయం చెప్పింది: "నేను సుల్తాను ప్రియ భార్యను. నా పేరు లబీబా. నా పతనం కోసం కుట్రలు పన్నే సవతులు చాలామంది ఉన్నారు. నిన్ను చూడగానే, నీ వంటి భర్త ఉంటే ఎంత సుఖపడే దాన్నోగదా అనుకున్నాను."

మేమిలా మాట్లాడుతుండగా గది తలుపు ఎవరో తట్టారు. లబీబా భయాందోళనతో, "కొంప మునిగింది! సుల్తాను తప్ప మరె వరూ తలుపు తట్టరు!" అన్నది.

ఆమె భయపడినంతా అయింది. మరు క్షణం పదిమంది నల్ల బానిసలు గదిలోకి ప్రవేశించి, ఒక గవాక్షం గుండా నన్ను నదిలోకి విసిరివేశారు. మరొక గవాక్షం గుండా లబీబా నదిలో పడిపోవటం చూశాను. నే నైతే ఎలాగో ఈది ప్రాణాలతో బయట పడగలిగాను గాని, నా మూలంగా నదికి బలి అయిన ఆ నిర్భాగ్యురాలి కోసం ఎంత వెతికినా దొరకలేదు.

నేను వెంటనే ఈజిప్టుదేశం వదిలి పెట్టి, బాగ్దాదు నగరానికి వచ్చాను. నా వద్ద ఒక్క బంగారు దీనారమే మిగిలి ఉన్నది. అది పెట్టి మిఠాయీ, పళ్ళూ, సుగంధ లేపనాలూ, గులాబీ అత్తరూ కొని, వాటిని ఒక తట్టలో పెట్టుకుని, పాటలు పాడుతూ





దుకాణాల దగ్గిర అమ్మసాగాను. నా కంఠం ఇంపుగా ఉండటం చేత అమ్మకం చురుకుగానే సాగింది.

ఇలా ఉండగా ఒకనాడు బాగ్దాదులో కెల్లా పెద్ద దుకాణం గల వర్తకుడు నా దగ్గిర ఒక పండుకొని, నన్ను తన పక్కనే కూర్చోమని, నా పేరు అడిగాడు.

"బాబుగారూ, మానేగాయాన్ని కెలకకండి," అని విచారంగా అన్నాను.

వెంటనే ఆయన మాట మార్చి, నా అమ్మకం గురించీ, లాభం గురించీ మాట్లాడి పది బంగారు దీనారా లిచ్చి పంపేశాడు. అటుతరవాత నేను ఆయన దుకాణానికి వెళ్ళి, ఏదో ఒకటి అమ్ముతూ వచ్చాను.

ఆయన నన్ను తన పక్కన కూర్చోబెట్టుకుని, నా పేరు అడిగేవాడు. కృతజ్ఞత కొద్దీ ఒకనాడు నే నాయనకు నా కథ అంతా చెప్పేశాను.

"నాయనా, అబూ అల్ కాసిమ్! నేను నీకు తండ్రి నవుతాను. నేను నీ తండ్రి కన్న ధనవంతుణ్ణి. నాకు పిల్లలు లేరు. నీ కష్టాలు ఈడేరాయి. ఆ తట్ట అవతల పారెయ్యి," అన్నాడాయన ఉద్రేకంతో.

ఆ మర్నాడే ఆయన దుకాణం కట్టేసి నాతో కూడా బస్రాకు బయలుదేరాడు. అదే ఆయన జన్మస్థలం. ఇక నుంచీ మే మిద్దరమూ బస్రాలోనే విశ్రాంతి తీసుకునేటట్టు నిర్ణయం జరిగింది.

బస్రాలో నన్నెరిగిన వాళ్ళందరూ నా దశ మారినందుకు ఎంతో సంతోషించారు. నేను నా కొత్త తండ్రిని సంతోష పెట్టటానికి శాయశక్తులా కృషి చేశాను. ఆయన నాతో అనేక సార్లు, "అబూ అల్ కాసిమ్, నేను నిన్ను చూసిన ఘడియ చాలా మంచిది. నువ్వు విశ్వాసపాత్రుడివి, ప్రేమ పాత్రుడివి. నా అనంతరం నీకు చెందబోయే సంపదకు అర్హుడివి," అనేవాడు.

ఒక ఏడాది పాటు నేను ఎలాటి స్నేహితాలూ చెయ్యక, ఆయనకు సేవచెయ్యటంలోనే కాలమంతా గడిపాను. అంతలో ఆయనకు బాగా జబ్బు చేసింది.

ఆయన నన్ను దగ్గిరికి పిలిచి, "నాయనా, అనేకమంది తండ్రులు ఒక్క రోజైనా అనుభవించలేని పుత్రసౌఖ్యాన్ని నువు నాకు ఏడాది పాటు కలిగించావు. అందుకు నిన్ను దీవిస్తున్నాను. దేవుడు నన్ను పిలిచేలోపుగా నేను నిర్వర్తించ వలసిన విధి ఒకటి ఉన్నది. ప్రపంచలో రాజులందరికీ కలిపినా లేనంత సంపద నీకు దక్కనున్నది. ఇది తరతరాలుగా మా వంశంలో వస్తున్నది. అది మొదట మాకు ఎలా వచ్చిందో నాకు తెలీదు. దాని రహస్యం మాతాత నాతండ్రికి చెప్పాడు; ఆయన నాకు చెప్పాడు," అన్నాడు.




ఆయన నా చెవిలో రహస్యంగా కొన్ని సంగతులు చెప్పి, "ఇది మా వంశంలో ఉండే తరగని సంపద. అందు చేత నువు ధారాళంగా దానాలు చెయ్యి. అన్నిటి కన్నా సౌఖ్యం ప్రధానంగా చూసుకో. అల్లా నిన్ను దయగా చూసి, నీకు సుఖశాంతులు ఇస్తాడు," అని కన్నుమూశాడు.

నేను ఆయనకు నా విధులన్నీ నిర్వర్తించి, సంపదను ఆధీనం చేసుకున్నాను. పూర్వం నన్ను ఎరిగినవాళ్ళు, ఈసారి కూడా నేను బికారి నవుతానని జోస్యం చెప్పారు. కాని అలా జరగ లేదు. రోజురోజుకూ నా ఖర్చు పెరగసాగింది. బస్రాకు వచ్చే పరదేశీల కందరికీ రాజోపచారంగా ఆతిథ్యం ఇచ్చాను. అయినా ఇతరులు ఊహించినట్టు నేను పేదవాణ్ణి కాలేదు.

నేను చేసే ఖర్చు చూసి నగరంలోని అధికార్లకు కన్ను కుట్టింది. ఒకనాడు నగరపు ప్రధాన కొత్వాలు నా వద్దకు వచ్చి, అదీ ఇదీ మాట్లాడి, "ఏ యువకుడు ఎంత ధారాళంగా డబ్బు ఖర్చుచేస్తే, నా కేమిటి? నేను పొట్టతిప్పలు కోసం ఉద్యోగం చేసుకునేవాణ్ణి! కాని, చిత్రమేమిటంటే, సరిగా రొట్టెలధర పెరిగిన సమయంలోనే మా ఆవు ఎండిపోయింది," అన్నాడు.

"మీ ఇంటిల్లిపాతికీ రొట్టెల కిందా, పాల కిందా సుమారుగా ఎంత ఖర్చు అవుతుంది?" అని అడిగాను.



"రోజుకు పది దీనారాలు మించదు," అన్నాడతను.

"అది చాలదు. రోజుకు నూరు ఇస్తాను. ప్రతి నెలారంభంలోనూ వచ్చి మా ఖజానా దారునుంచి సొమ్ము పుచ్చుకోండి," అన్నాను.

పెద్ద కొత్వాలు కృతజ్ఞతా పూర్వకంగా నా చేతిని తీసుకుని ముద్దాడ బోయాడు. అంతా అల్లా నుంచి వచ్చేదేనని గుర్తుంచుకుని, నేను అతన్ని నివారించాను.

మర్నాడే కాజీ వచ్చి, "నాయనా, అయిదో వంతు పేదలకు పంచాలన్న ప్రాచీన సంప్రదాయం ఒకటి ఉన్నది. మా లాంటి వాళ్ళు అలాటి విషయాలు ఉపేక్షించ రాదు," అన్నాడు.

"తమరు చెప్పేదేమిటో నాకు బోధ పడలేదు. కాని చాలాకాలంగా తమకొక విజ్ఞాపన చేయాలనుకుంటున్నాను. పేద వారికి పంచగలందులకు తమకు నిత్యమూ వెయ్యి దీనారాలు ఇవ్వాలనుకుంటున్నాను. దయచేసి తమరు వాటిని స్వీకరించాలి. నిరాకరించ వద్దు," అన్నాను.

కాజీ నా కోరికను దయతో ఆమోదించాడు.

మరి మూడు రోజుల అనంతరం బస్రా పాలకుడు (వలీ) నన్ను తన సమక్షానికి పిలిపించుకుని, ఎంతో దయగా మాట్లాడి, "నీలాటి యువకుడు తన నిధులను నాకు రహస్యంగా తెలియ బరచినట్టయితే అతను చేసే దుబారా ఖర్చు గురించి నేను ఆక్షేపించనని అందరికీ తెలుసు," అన్నాడు.

"వలీగారికి నేను అలాటి నిధులను చూపగలిగితే ఎంత బాగుండేది! అయితే ఈమధ్య నేనే మనుకున్నానంటే, నాకుగల కొద్ది ఆస్తిలో రోజుకు రెండువేల దీనారాలు సాధువులకు దానం చెయ్యటానికి ఏ అధి కారి అయినా ఉంటే నాప్రాణానికి సుఖంగా ఉంటుంది గదా అనుకున్నాను," అన్నాను.

వలీగారు నా తరఫున ఆ మొత్తాన్ని సాధుసజ్జనులకు దానం చెయ్యటానికి దయతో ఆమోదించారు.

"అది మొదలు ఈ లంచాలు మాన కుండా ఇస్తూ వస్తున్నాను. ఆ ముగ్గురు అధి

కారులూ నన్ను చిత్తం వచ్చినట్టు కానుకలు ఇవ్వనిస్తున్నారు. ఇదే నా తరగని సంపద కథ. ఈ కథను నే నింతకుపూర్వం ఎవరికీ చెప్పి ఉండలేదు," అని అబూ అల్ కాసిమ్ ముగించాడు.

ఈ యువకుడి నిధిని చూడాలన్న కాంక్ష ఖలీఫాకు తీవ్రంగా కలిగింది. ఆయన ఆ యువకుడితో, "ఎంత తీసినా తరగని నిధి ఎలా ఉంటుందో నేను ఊహించలేకుండా ఉన్నాను. దాన్ని కళ్ళారా చూస్తే గాని నమ్మలేను. దాన్ని నాకు చూపినట్టయితే రహస్యభంగం చెయ్యనని ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు.

"అతిథికి అసంతృప్తి కలిగించి పంపటం నాకు చావుకన్న బాధాకరమైనది. అందుచేత మీ కోరిక నిరాకరించను. కాని మీరు కొన్ని నియమాలకు అంగీకరిస్తే కాని నా నిధిని చూపించలేను. మీరు కళ్ళకు గంతలు కట్టుకోవలిసి ఉంటుంది. నేను మీ వెంట కత్తి చేత బట్టుకుని వస్తాను. మీరు ఏ మాత్రం దౌర్జన్యం చేయబూనుకున్నా నేను దానిని క్రూరంగా మీ పైన ప్రయోగిస్తాను. దానికి అభ్యంతరం లేకపోతే నా వెంట రండి," అన్నాడు అబూ అల్ కాసిమ్.

"నేను ఏ నియమాలకైనా సిద్ధమే," అన్నాడు ఖలీఫా.

అబూ అల్ కాసిమ్ ఖలీఫా కళ్ళకు గంతలు కట్టి నడిపించుకుంటూ రహస్యంగా ఉన్న మెట్ల మీదుగా భూగర్భంలోకి తీసుకు





పోయి, అనేక సొరంగాల కుండా తిప్పి తిప్పి తీసుకు పోయి, ఒక దీర్ఘమైన గుహలోకి ప్రవేశపెట్టాడు. అది చాలా లోతున ఉన్నది. ఇక్కడ ఖలీఫా కళ్ళ గంతలు విప్పుకున్నాడు. అక్కడి గోడల నిండా అమర్చిన సూర్యకాంతిమణుల కాంతికి ఖలీఫా కళ్ళు జిగేలుమన్నాయి. ఆ కాంతిలో ఆయనకు నూరు అడుగుల వ్యాసం గల చలవరాతి కొలను లాటిది కనిపించింది. దాని నిండా బంగారు నాణాలున్నాయి. దాని గట్టున పన్నెండు విగ్రహాలున్నాయి. ఒక్కొక్క విగ్రహమూ ఒక్కొక్కరకం మణిలో మలిచినది. అన్ని విగ్రహాలకూ బంగారు దిమ్మలున్నాయి.

"ఈ బంగారు కొలనుకు అడుగులేదు. మా వంశంలో వారంతా ధారాళంగా ఖర్చు పెట్టగా బంగారం అరంగుళం కూడా తరగ లేదు," అంటూ అబూ అల్ కాసిమ్ ఖలీఫాను మరొక హాలులోకి తీసుకుపోయాడు. అక్కడ ఇంకా పెద్ద కొలను ఉన్నది. దాని నిండా ముడి వజ్రాలూ, సానపట్టినవీ పోసి ఉన్నాయి. దాని చుట్టూ రెండు వరసలలో చెట్లున్నాయి. అవి ఖలీఫాకు లభించిన "నెమలి చెట్టు" లాటివే.

కొలనుకు ఎగువగా కప్పు మీద ఇలా రాసి ఉన్నది.

"ధారాళంగా వ్యయం చేయగలవాడే కలిగినవాడు; స్నేహం తప్ప దక్కించుకోదగినది ఏదీ లేదు."

ఖలీఫా ఇలాటి సంపదను చూస్తూ ఇంకా ఎన్నో హాలులు చూసి విసిగిన మీదట, అబూ అల్ కాసిమ్ ఆయన కళ్ళకు తిరిగి గంతలు కట్టి, తన ఇంటికి తీసుకు వచ్చాడు.

ఇద్దరూ కూర్చున్నాక ఖలీఫా యువకుడితో, "నువు నాకు బహుమానంగా ఇచ్చిన అమ్మాయిని చూస్తే, నీ యింట చాలా మంది సౌందర్యవతులు ఉండాలనిపిస్తుంది," అన్నాడు.

"లేకేం ఉన్నారు. కాని నాకు వారందరి కన్నా, నన్ను ప్రేమించి నదికి బలి అయిన ఒక్క స్త్రీ జ్ఞాపకం విలువైనది. లతీబా నాకు

తిరిగి దక్కేటట్టుంటే మీరు చూసిన నా సంపద అంతా ఇచ్చెయ్యగలను." అన్నాడు అబూ అల్ కాసిమ్.

అతను ఆ స్త్రీని ఇంతకాలమూ మరిచి పోలేక పోవటం చూసి మెచ్చుకుని ఖలీఫా అతనితో, "ఎదట ఉన్న సౌఖ్యాలలో గతించిన కష్టాలు మరిచిపోవాలి," అన్నాడు.

ఖలీఫా అతని వద్ద సెలవు పుచ్చుకుని, అతను ఇచ్చిన కానుకలతోనూ, బానిసల తోనూ బాగ్దాదుకు తిరిగి వచ్చాడు. వస్తూనే ఆయన కారాగృహం నుంచి తన వజీరైన జఫర్‌ను రప్పించి, క్షమించి, బహుమానా లిచ్చి, "జఫర్, అబూ అల్ కాసిమ్‌ను ఏ విధంగా సత్కరించాలి? ఏ బహుమానా లిచ్చినా అతనికి పేదగానే కనబడతాయి," అన్నాడు.

"అతన్ని బస్రా పాలకుడుగా నియమించవచ్చు," అన్నాడు జఫర్.

"అయితే నువు వెళ్ళి అతన్ని తీసుకురా. అతని రాజ్యాభిషేకం మన కళ్ళముందే జరుపుదాం," అన్నాడు ఖలీఫా.

జఫర్ వెంట అబూ అల్ కాసిమ్ రాగానే ఖలీఫా అతన్ని పుత్రవాత్సల్యంతో కౌగలించుకుని, తానే స్వయంగా అతన్ని స్నానశాలకు తీసుకుపోయి స్నానంచేయించి, ఇద్దరూ ఫలహారం చేసే సమయంలో గానం చెయ్యటానికి ఒక బానిస యువతిని రప్పించాడు.

అబూ అల్ కాసిమ్ ఆ బానిస యువతి ముఖం చూస్తూనే గట్టిగా అరిచి మూర్ఛపోయాడు.

అతను తిరిగి స్పృహతెచ్చుకున్నాక అతని మూర్ఛకు కారణం తెలిసింది. ఖలీఫా పిలిపించిన బానిస లబీబాయే! నదిలో కొట్టుకుపోతున్న లబీబాను ఒక పల్లెవాడు కాపాడి, బానిసగా అమ్మాడు. ఆమెను కొన్నవాడు కొంత కాలానికి ఆమెను బాగ్దాదు నగరానికి తెచ్చి, రాజభవనంలో బానిసగా అమ్మాడు.

ఈ విధంగా అబూ అల్ కాసిమ్ బస్రాకు రాజు కావటమే గాక తన ప్రియురాలిని తిరిగి పొంది, చాలా కాలం సుఖంగా జీవించాడు.

